# పలితకేశము

## కవి - రవి

[పద్యకావ్యములు]

కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి

యువ బుక్ డిపో

మద్రాసు & తెనాలి

# అర్పణము

మరపఁగారాని తొలుప్రేమ పురవజేసి
చీకటింట గప్పుఁదివ్వె నెమ్మె సిలిపి
వలపుఁతిభూతి మల్లికావల్లి నాటి
బ్రతుకుబాటల పుప్పొడి పరచి, మరల
జీవితాశలు రెక్కాని చేసగిల్ల
భగ్నహృత్పాత్ర సంధించి ప్రణయమధువు
అంచుపొరలగ నింపిన అన్నపూర్ణ
కర్పణమొనర్తు సీకృతి నమలరక్తి.

"వేళ కన్నంబు దినుటయు, వేగులేచి
చేనుచెట్లు విచారించు చింత లేక
పోయినను బోని, గడ్డంబు గొరుగుకొనగ
క్షౌర మొనరించుకొననైన దీరలేదె?

తలపయి దువ్వెన మెదలిన
పొలకువ గనుపింప దెపుడు; పూర్ణంబుగ ట్రుం
కుల గూరియున్న దుస్తులు
వెలుగుం గనబోవు పెండ్లిపిలుపులనాడుఁ.

పగలు ప్రొద్దస్తమానము పడకపైన
బుస్తకము లిరుప్రక్కల బారలు చుండ
జదువు చదువని యొండెద్ది సరకుగానక
తలుపు బిగియించుకొన్న నాతరమె పిలువ!

ఏది యెటు లున్న, దినగండ మింక నొకటి :
పిలువ వచ్చిన గొంతుక నులిమివేయు
నంత కోపంబు సన్యాసులైన మేలు ;
ఎంత పొరపాటు సంసారియింట బుట్ట?

ఆదిమత్వము మీయందు నలరెనేమొ !
మానవద్వేష మొక్కింత మతిని బడెనొ ?
నాగరకజీవనము కొన్ని నాళ్లనుండి
వదలితిరి ; లేక మి మ్మది వదలెనొక్కొ ?

కవులు సౌందర్యరసపిపాసువు లటంచు
జెప్పితిరి మీ రొకప్పుడు చిత్త మలర ;
అట్టి రమణీయతాప్రీతి యట్టితలపు
లెటుల నావిరియైపోయె నింతలోన ?’’

అని తన యభిరుచి దెల్పుచు
అని యననటు నన్ను దాకనాడుచు గోపం
బున కెడమీయని చిఱునగ
వొనరిచి నను విగతబాణు నొనరిచె సతియున్.

కన గ్రంథంబుల నోటుబుక్కుల దిరస్కారంబు సూచింప ది
గ్గున నొక్కుమ్మడి సందిటన్ జవిరి ప్రోగుంబెట్టి మేజాపయిన్ ;
వినయాచ్ఛాదనరక్షితంబగు దురావేశంబు వీక్షించి స్త్రీ
జననైజంబు ప్రతిక్రియారహితచేష్టానైపుణిన్ మెచ్చితిన్.

ఏమనుకొందునో యనుచు నింతల నంతల దారసిల్లి నా
మోమున గోపచిహ్నములు మోసిడకుంటకు సంతసించుచుం
గామిని నీరమున్ బురుసు కత్తిని సబ్బును దర్పణంబు దా
నేమును సిద్ధపెట్టి యికనేని కడంగుడు 'షేవు' కంచనన్.

ఆననము నద్దమున గాంచ, నలివపొడుపు
లన్నియు సహేతుకములుగ నాత్మదోచె;
బురుసు గడ్డంబుపై బెట్టి నురుగు దేర
నెరుముచుంటిని; భావంబు తరుగుచుండె.

దారింబోయెడు బాటసారి యితర ధ్యానంబునం దుండ, గా
ల్జారన్ మెల్లనురీతి నామనము స్వేచ్ఛాపుష్పకం బెక్కి ది
క్కారంబుల్ కడముట్టుచుండగ హఠాద్భంగంబు చేకూరె; గ
న్నారం గాంచితి దెల్లనైన యొక కేశాంకూరమున్ మీసలన్.

భరముగ గుండెలో నెగిరి పడ్డటు లయ్యెను; జవ్వనంపు బం
గరు కల లెల్ల రెక్కలెదుగం బరతెంచెడు పక్షిశాబముల్
కరణి గులాయమున్ విడుట కన్నుల గట్టె; క్షణంబునన్ మనో
హరమగు జీవితాంబరము నంబుదకశ్మలమై కనంబడెన్.

విరియు రేకుల మంచుతుంపురులు జార
బ్రొద్దువొడుపున జలిగ్రాగు పూవునందు
జీడపురు వొందు చేరిన జాడ తోచె
మీసమున దెల్ల వెంట్రుక మోసుగాంచ.

మున్ను ఎన్నెన్ని మార్లు మోమోట లేక
కత్తిరించితి మీసంబు; కలుగ వెట్టి
మార్పు లాందోళనంబులు మానసమున ;
అది సరర్ధకపరభృత మనుచునుంటి.

ఒక్కొకప్పుడు ఎందుకు నొదవసట్టి
యల్పవస్తువె ప్రముఖమై నదనుబట్టి ;
నల్ల వెంట్రుక మొట్టిక తెల్ల నోట
సకలమానవ సర్వర శత్రు వయ్యె.

చెలి యది గాంచి సంబరిష సించునో యేమొ! జపాసుమాంతరో
జ్వాలమధురాధరాంచల లసస్మృహాసము మందగించునో !
యలకువ చూపి వచ్చె ముసలాతడటన్న నిరాకృతిం ననుం
జులకన సేయునో యనుచు స్రుక్కినమేమము, ధైర్యమూనితిఁ.

ఏమి పొరపొచ్చె మెరుగక యున్నినాళ్లు
ఆలుమగలము దాంపత్య మనుభవింప
బానకములోన బుడకట్లు వచ్చినావె
తెల్ల వెంట్రుక, నీతస్సదియ, నేడు.

దానిని గాంచినయంత నె
మానసమున ద్వేషవహ్ని మల్లడిగొన నే
బూనితి జేతం గత్తెర
ఖూనీసేయంగ దొడరు క్రూరునిభంగిన్.

''ఆకుమరంగు పండుటాకుల నక్కులకుం గనరాక యొంటివై
నా కను బ్రామి మాటున మనం దలకొంటివె యున్నినాళ్లు; నా
సాకతమైన నెంచవు; విచారము లేక వధింతు నంచు నే
వాకొని కత్తిరింప, నది పాయక లోపలజిక్కి వ్రేలుచున్.

నను గని ''యో వెడంగ, యిది నాయమె యొంటరినైన నన్నులో
గనికర మేమి లేక చిరు కత్తెర నొత్తితి వంత బోయు నే?
దినదిన జృంభమాణముగు తేజు దొలంకెడు మచ్ఛరీర వ
ల్లిని మొదలంట గోసి వెడలింపగ సాధ్యమె యెట్టివానికిన్?

నేడు ఛేదించితివి, రేపు చూడు నన్ను
నాలువిధంబున మోసిత్తి తొంగిచూతు ;
పృథివిజనులకు గాలంబు వేయుచున్న
ప్రశ్నగుర్తును, బదులేమి పలుకగలవు ?

శత్రువునుగాను, మానవమిత్ర మౌదు ;
సత్య మెరుగ, దమోరుద్ధ చక్షులైన
వారికి వెలుంగు జూప నవ్యాజకరుణ
గాగడా పట్టుచుందును గాలనియతి."

అని యిటు ప్రేలెడు వెంట్రుక
తునుకం గని యంటి "నోసి, తోరపుగర్వం
బున దేవదూత వీవే
యనుకొని రక్షించుమాట లాడెద వరరే !

కొలదిమెరుగని యుద్ధతి ! గొర్రెతోక
యెంతయెదిగిన లొడితెడే ! యింకనైన
బుద్ధితో నోరువాగక పోదువేని
పరువు దక్కును ; లేక, దెప్పరము దక్కు."

అనుచు దిరస్కరింప రవమైన మనంబున జిన్నపోక రె
క్కొని యది పల్కె : ''మిమ్ము నన గూడదుగాని కవీశులారా; మీ
రనినటు నేను నల్పతరమైన, ననుం బరిమార్పలేని మీ
ఘనతయు బుద్ధివైభవవికాసము లంతకు దక్కువేగదా ?

మాటకుమాట తర్కంబు మదులుదాటు ;
నుడుకుమాటల నేమి ప్రయోజనంబు ?
కాలసమ్రాట్టు నిత్యకైంకర్యమందు
మెలగుచుండుట ఘనులము మేము కామె ?''

కనివిని యెఱుగని వెంట్రుక
మొనసనిక్కను డంబురంబు మురళించుటలున్
వినివిని యచ్చెరువందుచు
బనిదోపక యుంటి రిచ్చవడినవిధానన్ .

''కనుమోయీ, యిల రాజ్యభోగములు సౌ
 ఖ్యంబుల్ గృహారామముల్
ధనధాన్యంబులు బంధుమిత్రులును గాం
 తాపుత్ర సౌభాగ్యముల్

పౌనరన్, సర్వము శాశ్వతం బని తృష్ణా
  లోలాంతరంగంబునన్
దినముల్ ద్రుచ్చెదు మూఢమానవునకున్
  దీపంబు నందిచ్చెదన్.

చెలువలు ప్రేముడింగదుము చిక్కని కౌగిళులన్ సుఖించి ని
చ్చలు మధురాధ రామృతరసంబున మత్తిలి యౌవనంబుని
శ్చల మని యెంచ కామపరిచర్య యొనర్చుచు భావికాలచిం
తలు తలపెట్టబోని పశుతత్త్వ నినిద్దుర లేప నచ్చితిన్.

కాలరథప్రచార మొక ఖండనిమేషము నాగ బోదు భూ
పాలుని యాజ్ఞకుం, బరమభక్తుని మ్రొక్కుకు, దిక్కు లేని చం
డాలుని కంటినీటి కెరటాలకు; గాల మమూల్యమోయి, యా
కాలుడు రాకమున్నె వెనుకందగు విస్మృతజీవితార్థముల్.

ధనధాన్యంబులు కూడబెట్టి కుడువన్ దానంబుసేయన్ మనం
బున రాకున్ని శ్రమంబె నీకు దుదకుం బ్రోగాను; నిక్కెందరో
ధనికుల్ దాచిన పెన్నిధుల్ పరులచేతం జిక్కి భోగింపరే?
తిను, వెచ్చింపుము, దానమిమ్ము ప్రమిదన్ దీపాంకురంబుండగన్.

ధనము గలవార లెందరో
మని చచ్చిరిగాని వారి మాటయు గలదే?
జనహితకార్యంబులకై
తను ధనము లొసంగ గీర్తి దనరదె చిరమై?

గడియారంబున టక్కుటక్కుమని వేగం గొట్టు శబ్దంబువెం
బడి నాయుష్యము ఒక్కటొక్కటిగ సోపానంబులన్ డిగ్గు; నా
త్తిడులన్ శక్తియు సన్నగిల్లె; బరసందేశంబు రానున్న దో
బడుగా, యీపదినాళులైన విడకే పాథేయ మార్జింపుమా.

పరులను నోరుగొట్టి పలుపాపముల న్నిరతం బొనర్చి ని
ష్ఠురణముగా దరిద్రులను గారియవెట్టి ధనంబు గూర్చి కొ
ప్పెరలకు నింపి చూచుకొని ప్రీతి వహింతువు; వారసుల్ నిరం
తరమును నీదుచావునకు దైవము వేడుదురోయి లుబ్ధుడా.

ఆర్జనంబున కెపుడు వ్యయంబె లెక్క
వ్యయమునకు మంచి వినియోగమాట లెక్క
అది యిదియు లేని యధను నిరర్థ జీవి
పుట్టి చచ్చిన లాభంబు కట్టిరాదు.

ఎందరు నెందరో మహితు లీయిల బుట్టియు గిట్టినారు; వా
రందర పాదలాంఛనము లంకితమయ్యె యశఃపథంబునన్ ;
ఇంకనుకన్ సగంబు గతియించెను జీవిత; మే మొనర్పకే
మ్రందిన నేమి నిల్చును ధరం బెనుదోసెడు బూది దప్పినన్ !

ధనము గడింపవచ్చు, సతతంబు సుఖింపగవచ్చు, జీవితం
బున నివియే సమస్త మన బోలునె? యిందుల గాటిగేటు దా
టిన గౌరయాన దెయ్యది? గడించినజ్ఞానమె యాత్మ నంటి వ
చ్చును బరలోకమందయిన ; జొప్పరివై చరియింప మేలగున్.

దైనికావశ్యకంబులు తక్కువైన
జ్ఞానసంపాదనమునకు గాల మబ్బు ;
పూరిగుడిసెల నివసించి పూర్వఋషులు
ఉపనిషచ్ఛాస్త్రముల బ్రజ కొసగ లేదె?

ఆసలు పెంచి తీర్చుకొన నర్థము నెట్టులో సంగ్రహించు నా
యాసముతోడ జీవితము నంతయు బుత్తువు ; నీదుచర్య వ్య
త్యాసములేని యంత్రగతి యౌ; జననంబును బెండ్లి బిడ్డలుఁ
గ్రాసనివాస; మంత దుదగాంచు జరిత్రము మృత్యుపూర్తిగన్.

దినమున నొక్క పూటయిన దిండికి లేక దరిద్రమానవుల్
వనరుచు నుండ నీధనము వాసనకట్టు బిగించికట్టి యే
యనుభవ మొందబోయెదవొ? యందర బీదల వేడియూర్పులం
దసరు దవాగ్ని నీబ్రతుకు దగ్ధముసేయదె యొక్కపెట్టునన్!

తేటనీరము పై తేలె, దిగెను జిడ్డు
అడుగునకు; నెల్లకాలంబు నటుల నుండ;
దించుమించుల సరిదిద్ద నెప్పుడైన
విశ్వవిప్లవశక్తి యావిర్భవించు.

కాల మెన్నడు నొకరీతి గడవబోదు
తారుమారులు సహజంబు ధరణియందు;
అతిగ మెక్కి యజీర్తిని అడలువాని
మెసవుటకు లేనివా డాక్రమింపవచ్చు.

ఎందరెందరో నరపాలు రేలినారు
మిసరు ఫారోహు కనుబొమ్మ మెరయుచుంటి;
సీజరుని బట్టతల నొంటి జేరియుంటి
కైసరులజాయిమీసాల గడలుకొంటి.

నాటినుండియు నేటికి నాకు దెలియ
నట్టి రాజులు రాజ్యంబు లవని లేవు;
అరసినంతకు నా క్క సత్యంబు గలదు
జనుల బాధించు నృపుని రాజ్యంబు గూలు.

ఈ ప్రబోధమెల్ల నితరులకే యని
యనకు, నీకు సైత మన్వయించు;
బరహితోపదేశ పాండిత్య మని యెంతు
వేని, దాన నాకు హాని లేదు.

పది పదునాల్గు వర్షముల పాటు కలంబును ముట్టకే సుఖా
స్పదమును నిర్విచారమగు వ్యర్థపు సోమరి జీవితంబు నీ
కొదవెను; నేనుగూడ మొనయొత్తితి; నిద్దుర మేలుకొమ్ము; నీ
యెద జిగిరించు భావముల కిమ్ము మనోహరరూపసంపదల్.

ఒకవేళం బదునైదువత్సరములన్ యుష్మద్ఘుటీపూర విం
కక యున్నం బదివేలు; గాలిబయలం గంపించు దీపంబుగా
దాకొ జీవాత్మ; యవజ్ఞ చేసి యవకాశోత్సాహముల్ కాలహిం
సకు గాల్చాపితి, వింకనైన గవితాసాంగత్యముం గోరుమా."

పలితకేశము న న్నిట్లు పలుకరించి
మరణభయము ప్రదర్శించి మందలింప
నిట్టు లంటిని నవ్వుచు: "నెంత పెద్ద
వేత్త వైతివె నీబూది పెన్నగలయ!

జనన మొందిన ప్రాణికి జావు నిజము;
చావు చావని భయపెట్టలేవు నన్ను;
జావకే యుండినన్ శిలాశాశ్వతముగ
దాతముత్తాత లెచ్చట దాగినారు?

మరణము భౌతికంబగును మారుపు; దానికి జింత యేల? యు
ర్వర ధనధాన్యభోగవిసరంబుల బంధుల నాలుబిడ్డలం
దిరముగ వీడలేని యెదతీపులు వాంఛలు సందడింప ని
ర్భరమయి తోచు మృత్యుపరిరంభము సత్యమెఱుంగకుండుటన్.

ఐన ననురాగసూత్రాల నలవికొలది
లాగినను త్రెస్సిపోవక సాగుచుండు;
కణ్వునంతటివానికి గరగ మనసు
అత్తవారింటికి గుమారి నంపునపుడు.

బాతు జలమున నీదియు బతుకులకు
అంబుబిందువు లెప్పుడైన నంటుకొనవు ;
కార్యమధ్యస్థుడయ్యు నిష్కామకర్ము
డంటి యంటక యాశల నతకరించు.

నేను మరణింప బోనోయి, మేనె మడియు ;
అదియు మొదలంట నాశనమగుట లేదు ;
మొదటి యణుయోగమున నూర్పులొదవె ;
నంతె ; కాటిబూడిద సత్త్వ గరిక పొదలు.

హిమశిలను నీరు నావిరి యిమిడియుండు
పగిది స్థూలాంగమున సూక్ష్మభాగ మమరు ;
దృశ్యమూర్తి నశింప నదృశ్యమూర్తి
మిగిలియుండును, మనసుతో దగిలియుండు.

నాట్యరంగంబునం దెర నడుమ దింపి
మరల నెత్తెడునందాక తెరపిఱుంద
జరుగు కార్యములన్ని ప్రేక్షకులకంట
బడనియటు మరణోత్తరాశ్వాస మలరు.

'మరణభయంబు నాకు నణుమాత్రము లేదు; మదీయజీవసం
భరణభయంబె యెక్కు' డని పల్కెను ఉమ్రఖయాము, దానిలో
బరమయథార్థజ్ఞానము ప్రపంచితమయ్యె; జగత్సమస్తలం
బురి విడదీయలేక ననుమానించిన నయ్యవి వీడిపోవునే ?

ఇష్ట ముండినొ లేకయో గాని యిచటనో
చెదరిపడినార మైహికజీవితమున ;
పరిసరంబుల కలవాటుపడక యున్న
నిల జనించినఫలము గ్రహింపగలమె ?

అన్నమో రామచంద్ర యం చడలువాడు
పరసుఖంబుల జూప సంబరముపడునొ ?
ప్రాణికోటుల కన్న మావశ్యకంబు ;
గాలిపిడికెళ్ల నెవ్వరి కడుపు నిండు ?

పుట్టి పెరిగితి; మొకకొంత పోయె వయసు ;
ఈప్రపంచానుభూతి యంతింతొ కలిగె;
ఎన్నొ మాతాతముత్తాత లెరుగనట్టి
యంత్ర తంత్రము లక్కరయయ్యె నేడు.

ఫోను రేడియో కారు విమానములును
దేశకాలదూరత్వ సంస్థితుల మార్చె ;
మున్ను కూపస్థమండూకములుగ నున్న
యఖిలజాతుల భావైక్య మవతరించె.

రామరావణరణము, కౌరవుల పోరు
సర్వనాశకముగ నేడు జరుగుచున్న
రూసుజర్మనుసమర నిర్యాసనమున
కడలిలో నీటిబుడగలకరణి దోచు.

ఇట్టి వెన్నెన్నొ యనుభూతు లిలనుగలిగె ;
బాల్యముననుండి యలవాటుపడుచువచ్చె ;
జచ్చి పరలోకమున గ్రొత్తజన్మమెత్తి
నలవరచుకొందు నచటిమర్యాద లిటులె.

పరము సత్యంబె యైనను బరముకొరకు
నిహసుఖంబుల బలియీయ నేల చెప్పుమ
పరము లేదని ఖయ్యాము పల్కెగాని
అట్టి యవకాశ మే నెన్న డవగణింప.

ఇహపరంబులరెంట గ్రహింపగలుగు
నఖిలసుఖదుఃఖముల నేను అనుభవించి
పుట్టెదను మళ్లి మా మాతృభూమియైన
భారతాఖండమండలభవ్యసీమ.

జాతి ముకుళితభావవిప్రయుక్తి
స్వార్థపరతంత్రమైయున్న సమయమందు
మరణభీతి దుర్వారమై మల్లడించు;
గర్హ్యదాస్యంబు స్వాభావికముగ దోచు.

ఉపనిషత్సారసందేశ ముజ్జ్వలాసి
కఠినధారాతళత్తళల్ గలసి పారు
నమృతగీతస్రవంతి రూపందుకొన్న
ఆర్యభువి మృత్యుభీః నింద్యంబుగాదె ?

ఇప్పుడప్పుడె ముక్తి నే నిచ్ఛగింప;
ఎన్నికోటుల యేండ్లో యీపృథివి ప్రబలు;
వేయిమార్లైన జన్మింప వీలుపడిన
బ్రతితడవ గోరుకొందు నీ పావనోర్వి.

అన్నికోట్ల ప్రజలు బద్ధులై శ్రమింప
నేనుమాత్రము ముక్తి వాంఛింపనేమి ?
అవయవంబులు కొన్ని దేహంబునందు
ప్రమద మొందనె యితరవి బాధపడగ ?''

అని పలుకగ విని వెంట్రుక
తను పరిహాసంబుచేసి నవ్వుచు ననియెం :
''కనుగొంటి నీదుకోర్కెలు ;
మనుజుడు స్వర్గంబుగోర మానునటోయీ ?

యజ్ఞములు చేసి కర్మల నాచరించి
సురపతిని తృప్తిపరిచిన సోమయాజు
లెల్ల రంభాదిభోగినీపల్లవాధ
రా పరీరంభ కాంక్షులై ఏగరె దివికి ?

తరళకిసాలకల్పకలతాసుమజాలము రాల్చు పుప్పొడిం
బొరలుచు స్వర్ణదీజలజపుంజములం జెరలాడి శీతశీ
కర పరిసేచనంబుగొని కమ్మని తెమ్మెర వేగుప్రొద్దులన్
నెరసెడు నాకలోకరమణీరజనీశ్రమతాపహారియై.

దురమున గోపుతూపు వెనుదూయఁగ బాయఁగ లాగి దాని గ్ర
మ్మర నరి నేయు బాహుబలమాన్యులు శూరులు యుద్ధభూములఁ
మరణము నొంది నిర్జరవిమానములన్ దివి జేరి జారిణీ
పురమున వాడవాడలను బొంచుదు రచ్చరపూవుబోండ్లకై.

గాంగసైకతముల దరగంటిచెలులు
కాముకులఁగూడి చరియింత్రు కమలషండ
మండితోత్తుంగవీచీప్రకాండపటలి
శిశిరశీకరసాత్త్వికశ్రీలు చల్ల.

అమరవనాంబుజాకరమునందు దిగంబరలైన యప్సరో
రమణులు క్రీడసల్పుచు దరంగములం జెరలాడగన్ సమీ
పమున మెలంగు కాంతు లగపట్ట సరోరుహిణీకదంబ మ
ధ్యమున మొరంగి పుష్పనిచయంబుల గన్గొనరా రభిన్నతఁ.

పొలుపుగ బూలు పాలవలపుల్ చిలికించుచు రెమ్మరెమ్మలన్
బలకొన, నల్లిబిల్లిగొని వల్లిక లల్లులు వెట్టుటన్ రహః
స్థలు లయి, ప్రేయసీప్రణయదాస్యము గోరెడి వల్లభాళికిన్
నెలవులుగా సరోవరమునీట రహించు లతాంతరీపముల్.

అంచబోటి సరస్తీరమందు మంద
మందగమనంబునం బోవు చంద మరసి
యచ్చరనెలంత నడకయొయ్యార మరసి
యించు మించుల దేల్పలే కేగు బ్రియుడు.

చల్లవెన్నెల గాయు ప్రశాంతనిశల
బూలతేపలపై నెక్కి పూవుబోండ్లు
కాముకులు తెడ్లువేయ గంగాస్రవంతి
జలవిహార మొనర్తురు చెలువ మొలయ.

ఉంగరాల్దిరిగి లే బంగారునొసలిపై
    దారలు కస్తూరి ముంగురుల తీరు,
కాటుకచీకటిం గలసి రెట్టించిన
    కడగంటి చూపుల కమ్మదనము,
పరికిణీ వలిపెంబుపయి వెల్లివిరిసెడు
    నొడలిచాయల దేటపడిన సొబగు,
చిగురాకువాతెర యెగబోయు కెంజాయ
    చెక్కుల బ్రతిఫలించిన పసందు

చెలువ మొండొండు వలరాచములికిగాగ
గాముకజిగీషతో రంభ కదలినపుడు
ఒక్క క్షణమైన బరికించియుండువేని
మరల భువి బుట్టు మాటలుమానుకొనవె.

హరిణి, మనోహరి, చంచల
హరిణస్ఫుటనేత్ర, నందనారామమునం
దిరుగుచు బూవులుగోయుచు
మురియుచు హరియించు దబిసిముచ్చులమనముల్.

పలుకుపలుకున దేనియ లొలుకుచుండ
నవ్వునవ్వున మాధురి నివ్వటిల్ల
జూపుచూపున వలరాజు తూపులేయ
గులుకులాడి తిలోత్తమ వలపు జూపు.

జరిపుటాణీపైట జలతారుపావడ
కుచ్చెళ్లు గుబురులై గునిసియాడ,
చెండంటి వరుగెత్తు చిడిముడిపాటులో
నోరపమ్యేక కాపుదారి సడల,

తలవెంట్రుకలు వీడి తొలదేటి తెరలట్లు
తరగలై గాలిలో తెరలుచుండ,
చిరుచెమ్మటలు ముత్తెసరులపోలిక చెక్కు
టద్దంబులకు వింత యందమొసగ,

కాముకుల గుండెనే చెండుగా నొనర్చి
యాడుచున్నయా యూర్వశి యనుని మేన
భిన్నభిన్నాంగ భంగుల జెన్నుచూపి
కొల్లగొను నెట్టిసంయమియుల్లమైన.

శాపానుగ్రహ శక్తుని
కోపోద్దీపిత మనస్కు ఘోరసమాధి
వ్యాపృతు విశ్వామిత్రుని
లోపరచుకొనె క్షణంబులో మేనకయున్.

ఎర్రగుట్టిన గాలంబు నేసి చేప
లాగు రీతి ఘృతాచి విలాసవీచి
ఎర్రవాతెరతరితీపు లెరను జూపి
యనువుకాండ్ర నెడందల నపహరించు.

గోచి బిగియించి తపస్వులై కూరుచుండి
పవన పర్ణాంబు భక్షులై బ్రతుకు మునులె
యచ్చరల మోహవాగురలందు జిక్కి
కలుచవారక నిర్ముక్తి గాంచినారె?

నీవన నెంత, నాకరమణీమణి యొక్కతె యోరచూపులం
జేవిరితో గపోలముల జిట్టకముల్ పచరించి నొక్క మో
హావిలమై హృదంతరము, అంగము కాకరకాయచందమై
చేవ దొలంగి వే పయుట చెంగును బట్టవె? రంగు చూపవే?

అమృతము పానముసేయుట
అమరులకున్ క్షుత్పిపాస లడగు సతంబుం
గమనీయభోగ మొదవును;
కుమిలి జరామరణబాధ గుందరు వారున్.

ఆరు ఋతుదశ లేకమై యలరుచుండు;
రేలు కలనాళ్లు వెన్నెల పాలు చిలుకు;
దుఃఖ మన మందు కేనియు దొరక దచట;
అంతరము లేని ప్రణయసౌఖ్యంబు లొందవు''.

అని యేమేమో వర్ణిం
పను గుటకలు మ్రింగుచున్న పండిన నెరకం
గని యంటి : ''నీవు రూపిం
చిన యాజీవితము నాకు జీదరగొలిపెఁ.

ముక్తివాంఛింతుగాని యామొగము మొత్తు
అమరపురి జేతికర్రతోనైన నంట ;
వలపుపస్తులు, కడుపుకొండలము గన్న
చెనటి కవిగాడు దాని సృజించియుండు.

ఆ కవికి వివేకింప లోకానుభవము
లేక యుంట యథార్థమా; లేకయున్న
ఏకతానంబునఁ మార్పులేవి లేని
యట్టి కొరగానిబ్రతుకున కాసపడునె ?

దుఃఖముండక సౌఖ్యంబు దోచు టెట్లు ?
కాంతి యెటు లూహ్య మగును చీకటులులేక ?
తారతమ్యము కనుగొన దరమె మనకు
దుదకు సరిపోల్చ రెండువస్తువులు లేక ?

భూపతుల కోశములు కొల్లవోవ ధనము
గాంచి, మేకల జంపి యజ్ఞము లొనర్చి
నేయి త్రావక మంటపాల్సేయు టెల్ల
దండులంజెల పడుకల బండుకొననె?

యుద్ధమున జచ్చి వచ్చిన యోధు లచట
కత్తి డాలు డవాలుతో గండుమెరసి
వేల్పు చెలులిండ్లు ముట్టడివేయ, వృద్ధ
సోమయాజుల కవకాశ మేమి యుండు?

రూసుజర్మనుదురమున గోసయీక
తెత్తుసోల్దారి నాక్కసి నెరుగబోము;
అచట గోటానుకోట్లుగా నంతరించి
స్వర్గమునకు వచ్చెదరొ యచ్చరలకొరకు?

నెలలకాలము రణభూమి నిలచి యుండి
ఆడుమోమును గలనైన నరయనట్టి
మొరకసోల్దారిమూక నాముద్దుబోడు
లారుగురు ఎంత యెంతని యరసికొంద్రు?

అలరులపుప్పొడిం బొరలి యల్లన గమ్మని తావు లీనుచున్
మెలగెడు గాంగశీకరసమీరము వారి నిశాపరిశ్రమల్
పోలియ జరించు నంటి; యిక బోటుల తాపము దీర్పగా ద్రవే
య లయకరంబు రెక్కల సంఘర్షణముం గదలింప రావలెన్.

భరములై తోచు నిట్టి యుపద్రవముల
దెచ్చిపెట్టిన హిట్లరు దిట్టవోసి
పడక తప్పించుకొనెడు నుపాయములను
అరయుచుందురుపో వేల్పుటతివ లిపుడు.

అమరపురీవిహారముల నచ్చటి తోటల నాటపాటలన్
రమణుల యందచందముల రమ్యములౌ జలజాకరంబులన్
విమల వియర్ఝరీ చలిత వీచుల, సైకతవీథులన్ మనో
జ్ఞముగ వచించినాడ; వవి కంటికి క్రొత్తలె భూతలంబునన్?

పుడమిపయి సౌఖ్యములులేని పూర్వకాల
మందు సృజియింపబడియె సురాలయంబు;
దాని నేటి ప్రపంచముతోన బోల్ప
ప్రాబడినరీతి గన్పట్టు బ్రభ దొలంగి.

నీవు నోరూరునట్లు వర్ణించినట్టి
వాసవపురీసుఖంబు మద్రాసుబీచి
యిసుకపరపుల బన్నుండ నెదదారంగు
హాయికంటెను గమనీయమగునె చెపుమ.

కరము విశాలమై మెరుగు గారెడు తారుపథంబు క్రేవలం
దరువులు, పూలుపూచిన లతావలయంబులు, తోటమాలి క
త్తెర మెదలించునేర్పుమెయి దీర్చిన పూవులచెట్ల రూపముల్
పరగును దర్శనీయముగ బ్రక్క విహారము సేయువారికిన్.

కురులను దువ్వి యల్లికల క్రొవ్వెదచుట్ట రచించి, పూవులం
దురిమి, మొగంబునన్ వలచు ధూళులనద్ది, హిమం బలంది, చం
దురతిలకంబు దిద్దికొని, తొంగలి రెప్పల యోర గాటుకం
జరిమి, కరాచిచీరలపసం దొలయం జరియింత్రుకోమలుల్.

హరువుగ బాహుమూలముల కవ్వల నంతమునొందు 'బ్లౌజు' త
త్పరిసర మోహనప్రకృతి దాపక చూప, నిగారిపైటచెం
గరవిరి చన్నుచట్ట సగమందున నెక్కొని పిన్ను బాధతో
దెరలకయుండ బూటునడ తీరున వత్తురు కొందరంగనల్.

జలజకర్ణిక జుట్టు కింజల్కము లటు
వెనుక జుంజురువెంట్రుకల్ గునిసియాడ
ఆడుమగతనంబులు నేకమైన పడుచు
వెడలు దెరచాపలెత్తిన పడవవోలె.

భాంకృతులతోడ మోటార్లు వచ్చి నిలువ
సొగసుసరకులు బీచికి దిగుమతియగు;
ముసలిమగని రక్షణము వెక్కసముగొలుప
ఓర విడివడి మున్నేగు యువతి యొకతె.

అరుణుడు పశ్చిమాద్రిశిఖరాంతరుడైన రథాంగయుగ్మముల్
విరహమునం బరస్పరము వేచుచు రోసెడిభంగి ప్రేయసుల్
తిరుగుచు గుర్రపట్టుల బదేపదిచూచి నెలంత రాని జా
డెరుగక దారిబోవు పెరయింతుల జూతురు కాంతకోసమై.

మగల వరియించు చదువరి మగువలకును
యువతులం గోరు విద్యార్థి యువకులకును
వలపు పందేరములు పంచు తలపుతోడ
రతిమగండు వసించు మద్రాసుబీచి.

అల రెలప్రాయపుంగొమరె లొప్పుల పొంతల బీచి కాపిహో
టలి నుపవిష్టలై తినుబెండంగు తెరం గరకంట జూచి క
ప్పుల నెలకొన్న కాపి యల పూవులవిల్తుని మావిగుత్తులన్
జలజల నుట్టు తేనియల జాలని క్రోలుచు రచ్చటన్ యువల్.

మినమినలాడు వర్ణముల మీనము లా జలజంతుశాల గూ
ర్చిన పనుగాజుకొప్పెరల చెన్నొలయం జరియింప, దమ్ముగాం
చ నచట కేగినట్టి యలనాగల చీరల వర్ణసంపదల్
తనువుల బింబితం బయి ప్రతారణచేసె ననంగ శోంపిలున్.

కాలేజివిడుదల గాంచుటే తడవుగా
నలవోక నరుగు విద్యార్థితుటుము
పగలెల్ల లేఖనీ బాంధవ్యమున బుచ్చి
యూరడవచ్చు నుద్యోగిజనము,
ఆలుబిడ్డలకు దోడయి రేడియో విన
నల్లన నేగు గృహస్థుగణము,
పట్నంబు వచ్చిన పను లెల్ల ముగిసిన
హాయిగా దిరుగు పరాయిజనము,

కడలితరగల తుంపురులతడిని మోచి
మేన జందన మలదు తెమ్మెరలు వీవ
చిగురుటాకుల బన్నుండి సాగియుండ
అమరలోకసుఖంబేల యాసపడగ ?

గాలికిం జలరేగి లోలమై కెరటాలు
తుంపురుముత్యాలు తొలకరింప,
చెరచాప లెత్తిన తేపలు రాయంచ
లంతలై యలల డ్రుల్లింతలాడ,
సంజకెంజాయలు జంపుగా బింబించి
రుధిరాబ్ధి గగనసారూప్య మంద,
చెలుపారి తూర్పు మిన్నులువడ్డపట్టున
శీతాంశుబింబంబు జేవురింప,

పగటి పరుసన మెలమెల్ల బిగివిసడల
జల్లవెన్నెల లెల్లెడ నల్లుకొనగ
నవ్యరసవాద పరివర్తనంబు గాంచి
వీచి మోహనదృశ్యమై గోచరించు.

చంద్రబింబమునుండి యా జలధితటము
వరకు వజ్రాలరస్తాను పరచి ఎసగ
భంగముల బండువెన్నెల ప్రతిఫలింప
కడలి కొక క్రొత్తయందంబు గడఁగుకొనును.

తారకల తోరణంబులు బారుదీర్చి
దారి కిరువంకలం గట్టినారొ యనగ,
జారువిద్యుత్ప్రదీపికాస్తంభ రాజి
కృత్రిమసుధాంశుకాంతి రహింపజేయు.

ధరపయి నూత్న నాగరకతావిభవంబులు యంత్రసృష్టి య
బ్బురముగ వృద్ధిచెంద, నెటుపుట్టెనో యట్టులె స్వర్గముండె; స
త్వరముగ దానిలో నభినవంబగు మార్పులు సేయకున్న నా
కరమ ధరామనోహరతకంటె గృశించు గ్రమక్రమంబుగన్.''

''ఇన్ని డంబాలు గొట్టితి వింతసేపు
జర మృతిని బాపు నమృతరసంపుటూట
కల్పతరువు చింతామణి గలదె మీకు?''
అనుచు వెంట్రుక ప్రశ్నింప, నంటి నేను.

"అప్పుడొక్క విశ్వామిత్రుఁ డవనియందు
సృష్టికిం బ్రతిసృష్టి రచించెనంట;
నేఁడు జరుగు కృత్రిమసృష్టి నేర్పు మెఱుఁగుని
సకలదేశ రసాయనశాలలందు.

శాస్త్రవిజ్ఞాన మద్భుతసరణి బెరుగ
మానవుఁ డొనర్పలేని దేదేని గలదె?
మచ్చుక్రోవుల జీవాణుసర్గ మరసి
చేతనము గొన్ని యేండ్ల సృజింపగలఁడు.

స్వర్గము నధఃకరించి మీచోటినేల
చుక్కలంటఁగ బైకెత్తె జోద్యమయ్యె;
నాక మొల్లవయేని యానరకమొకటె
మిగిలియుండు; నదే నీకు దగిన తావు.

జ్ఞప్తిచేసితి వన్నెల్ల సమయమునకు,
వాంఛ గలదోసి నాకును: స్వర్గమందు
నిష్క్రియాజీవితముకంటె నిరయమందు
సత్యమార్గ ప్రచార సంసక్తి మేలు.

ఇచటి పల్లేరుగాయలు, నిచటినూనె
యిచటి మొసళులు పాములు వృశ్చికములు
ఎప్పు డెట్టుల నచ్చోటి కేగ నన్న
విషయపరిశీలనము చేయ వేడ్కగలను.

అదియె కాదు, మహాకఠోరతరశిలాభీలదౌష్ట్యంబునం
జుడుమై కష్టములొందుచు నాగరికవాసుల్ స్వప్నబంధంబులం
జడుమఱ లేక నిరంకుశులై యమానుషభటోత్సేకంబు సైరించి యా
పదలం బొందెడువారి లాత్మబలవిస్ఫారంబు నిద్రించుటఁ.

మధ్యయుగ నిరంకుశాచార మండలేశ
వికృతశిక్షాస్మృతి ప్రతిబింబ మైన
నరకరాజ్యంబు. ప్రజలు విజ్ఞానకాంతి
బడయువరకు బునాదులు సడలకుండు

ఆత్మకృత మోహనంబున నంధు లగుచు
దరళవేదాంతికాశయతంతుజాల
జాలమున జిక్కి వెలువడు వీలు లేక
పసిపికాపును బుఱగళ్లు పట్టనడిరి.

నరకమునకేగి యచటి సూనవుల కొక్క
చిరరహస్యంబు జెప్పిన, జిహ్వగుబాదల
నిప్పు పడి నాలుకలు చాప నెరియునట్లు
ఒక్క క్షణమున విప్లవం బుద్భవించు.

కాలుడను భీకరాకృతి కల్పితంబు ;
భావనాత్మక, మదిగాలి ప్రతిసనుమ్ము ;
పిట్టల నదల్ప జేలంగో బెట్టినట్టి
గడ్డిబొమ్మకు మనుజులు కలగనేల ?

కాలమనుమాట కొకరూపు కట్టిపెట్టె
వైదికకవీశు ; డది యెంతొ వందయుర్వ్య ;
మరి పురాణయుగంబున మల్లడించి
సర్వభీకరు డయ్యె ప్రసన్నముఖుడు."

అని విని వెంట్రుక యిట్లనె :
"విన నయ్యెను వెర్రిమొర్రి వేదాంతంబుల్ ;
మనుజులకు నిటు వచించిన
మనమున విప్లవము రాక మానునె చెప్పుమా.

స్వర్గనరకంబు లొక్కట బాధపడిన
దానధర్మము సేయు నుత్సాహ ముడుగు ;
ప్రజలలో పాపభీతి యభావమైన
న్యాయసత్యంబులకు నాశ్రయంబు తొలగు.

అదిగొ చూచి నిద్రింపరో రన్న యనుచు
జనని చిచ్చికొట్టిన బిడ్డ కనుమొగుడ్చు ;
ఉగ దెలిసి పెద్ద పెరుగ వా సుదరిపడునె ?
చంటిపాపల వెరపులు శాశ్వతములె ?

ప్రజల భయపెట్టి కపటతంత్రములచేత
బసుల దోలెడుపగిది నిర్బంధధర్మ
దాస్యమున ద్రోయుకంటె సత్యంబు దెలిపి
స్వేచ్ఛతో ధర్మమొనరింపజేయ మేలు."

నాపలుకులు విని వెంట్రుక
రాపాడ కనిష్టమైన రాజీపడియెన్ ;
"ఈ పెడదారుల నోరులకు
నీ పుణ్యము, తెలుపబోకు నిష్ఠుర మొదవున్."

అని వచించెదునంతలో సతివ వచ్చి
“అరరె! యిదియేమి యింకను బురుసుబెట్టి
గడ్డమును రుద్దుచున్నారు గంటయైన;
జెల్లగాగిన వేన్నీళ్లు చల్లపడిరె.

గొరుగుకొనవలయు విషయము
మరచితి; రన్నట్లె మీకు మతిభ్రమియించున్;
విరమించి పగటికలలను
గొరుగుకొనుండయ్యామీకు గోటినమస్సుల్.”

బరబర జంకక గొంకక
పరివాపనముం బొనర్చి పదపద మంటిం;
జిరునవ్వు నవ్వి యింతటి
త్వరయా యని యెత్తిపొడిచె దరుణియు నన్నున్.

కను లటు లెత్తి నేఁ గిటికికమ్ముల సందుల జూడ, దూర్పుకొం
డను నవమోహనాంబుద పటంబులపై లిఖియించికొన్న నూ
తనజలవర్ణ చిత్రముల దర్శనశాల నమర్చి, చూడరం
డనుచు రసజ్ఞులం బిలుచు నర్కుడు రమ్యపికార్భటీ మిషన్.

కరుణాపాత్రుఁడ వీవు భాస్కరుఁడ, యొక్కండుం ద్వదీయార్ద్రక
ర్బుర వర్ణాంకిత చిత్రశిల్పముల సొంపున్ నిల్చి వీక్షింప; డం
బరమార్గంబున గ్రుంకు మెట్టపయికిన్ నూర్చించు నీశాల; న
గ్గిరి నేయత్నుఁడో యేవరూధినియొ కాంక్షించుం గళాస్పృష్టులన్.

అనుదినముం బ్రదోషసమయంబున బ్రొద్దున వేయుచేతులం
బనిగొని వర్ణవర్తికలు వ్యగ్రముగా క్షణభిన్నరూప క
ల్పనల నలౌకికాకృతుల బంకజమిత్ర, యయాచితంబుగం
బొనరిచి నీ యపూర్వకళపోడిమి జుల్కనసేయ పాడియే ?

అడుగకమున్న లభ్యమగునద్ది యమూల్యమె యయ్యు దానినిం
బొడగనినన్ నిరాదరము పుట్టక తప్పను; చిత్రశాల పె
న్జడిగొనునాళ్ల మూయుము; గనంబడు నర్కుర, లేనినాఁడు; ని
మ్మడియగు బ్రేమయున్ విరహమధ్యమయేని స్వభావసిద్ధమై.

అని వచించు నేను, రుచిరారుణమూర్తి పసిండి క్రాగుమూ
సను బురణింప బేశల లసన్మృదుహాసముతోడ బల్కె నో
మనుజుడ, స్వార్థతత్పరుల మానస మెప్పుడు లాభకాంక్షతో
బెనగొను; త్యాగజీవనము విస్మృతమయ్యె ధరాతలంబునన్.

మనుజున కింత గర్వ! మొక మర్త్యుడ వీవు; అనంతసృష్టి నీ
మనుగడ నీవు నెంత? అణుమాత్రము బోల; నమేయతారకా
గణాభరితాంబరంబున కఖండ జగత్తున కేను చక్రవ
ర్తిని; గ్రహముల్ నిరంతర పరిభ్రమణంబున నన్ను గొల్చెదున్.

నేను లేకున్న భువన మంధీకృతంబు ;
చేతన ప్రపంచమునకు జేటుమూడు;
చంద్రముఖాది గ్రహంబులు సరణిదప్పు;
ఇరుసువిరిగిన బండినా నొరగు జగతి.

ఈయనంతసృష్టికి సూద మొసగజేయ
వ్రాయుచున్నాడ నాలేఖ్యపటము లెపుడు ;
కౌతుకముగూర్చు నిష్కామకర్త నాది ;
అట్టి నాకు నీ కనికర మవసరంబె?

చీకటిరేయి గొండపయి జేరి యొకండ వగణ్యతారకా
నీకము వ్రేలు శాంతమగు నింగిని జూడుము, నిన్ను జూచుకో
వ్యాకవి, నీయణుత్వ మటు నూహకు దట్టు; ననంతరంబు గ
ర్వాకులచిత్తవృత్తి కిసుమంతయు గారణ ముండ దెన్నడున్.

నీటిపురువులు చేపలు నిఖిలజలచ
రంబులును బొట్టుచేమలు ప్రబలఖేచ
రములు మృగములు సృష్టిలో బ్రాతవడిన
పిదప మనుజుండు పొడసూపె బృథ్వియందు.

జలజహితుండు ఈగతి బ్రసంగవశంబున బల్కె గోపసం
జ్వలనము రేగి మానవయశంబె త్రిలోక్యతిక్రాంతమైనయట్లు లో
దలచి యిటంటి: నీకు నిది ధర్మమె యోరీ నరజాతియున్నతిన్
మలినపడంగ దూరెదవు; మానవు డాద్యుడు గాడె జీవులన్?

తిరుపతికొండ నెక్కి పురిదిక్కున జూచిన గ్రింది గుళ్లు గో
పురములు బొమ్మరింట్లటు లఘుత్వసమాకృతి దోచు; మింటిపై
నిరతము సంచరించుటను నీకగపట్టు హిమాలయంబిలం
బరిచిన మట్టిదిబ్బపటముభంగి; మనుష్యుల మాట చెప్పనా!

సత్యమా; గ్రహనక్షత్రచక్రమునకు
అక్షదండంబ వౌట యోజుకురణాకిరణ ;
అయనసుం గాలిచెడంత యుగ్మగోళ
మటుల గన్పింతు వీవు మానుషులకును.

కేతుగ్రస్తుడ వౌదువు :
పాతరలాడెదవు మింట బరతంత్రుడవై ;
సీతున రజకుం జిక్కెదు ;
యాతాయాతశ్రమార్తి నడలెద వెపుడున్.

గురిగింజసామెతయ్యెను
నరసృష్టినిగూర్చి నీవు నాకు వచింపన్ ;
సరి ! శిల్పి వగుటకంటెను
చరిత్రాధ్యాపకుడ వౌట చక్కగ నుండున్.

మనసున కజీర్తి హెచ్చిన దినమునందు
వెర్రికలల చిత్రంబుల వేయు దార !
నీకును రవీంద్రసత్కవి నేర్పినాడో ?
లేక నేర్చెనా నీ చిత్రలేఖనంబు ?

నా పలుకులు విని సూర్యుడు
కోపము రానీక లోన గొందలపడకే,
పాపము! కుర్రడు నజ్ఞుడు
తాపమునకు దగడటన్న తలపు దోలంకేఁ.

ముసిముసినవ్వు దొంతరలు మోమున, గన్నుల నెల్లిదంబునుం
గసిమసగంగ నాపయి నొకానొక హేయపు జూపువైచి, మా
నిసుల సమస్తతత్త్వమును నీవలనం గనుగొంటి నోయి, వె
క్కసమును బ్రీతి మెప్పునుడికారము నిందయు నూరు, గాలికిన్.

క్షణమునకుమున్ను నా శిల్పకౌశలంబు
పొగడి మెచ్చితి వింతలో దెగడు టేల?
మూఢభక్తులు సత్యంబు ముట్టలేరు
మనసు ఊసరవిల్లి మీ మానవులకు.

నన్ను వేపించదలచెనో, కన్నుగిట్టి
వేడ్క చూడంగ వలచెనో వెర్రితరణి
కొరవికట్టెను ఎదలోన గులికినట్లు
హత్యసేయంగ బోయినయట్లు పలికె.

కట్టకడసృష్టి నరుఁ డన్న గనలనేల?
యింక నొక సత్యసూక్తిని ఎఱుగుమోయి;
వేనవేలేండ్ల క్రిందట విపినచరము
లైన కోతుల సంతతి యనని జనము.

శీతవాతోష్ణములు మార్పు చెందు కతన
ప్రకృతి సర్వంబు కాలానుబద్ధసరణి
మనము కనరానియటు రూపుమారుచుండు;
అట్టి పరిణామఫలమె నీయట్టి నరుడు.

తలుపుగుబ్బను మోచేయి తట్టుకొనగ
గనులు పచ్చగ బోయెడి కరణి దోప
పిడు గడిచినట్టు లీ మాట వినిసయంత
కొంతసేపు నిశ్చేష్టత గూరుచుంటి.

మఱి యొకయింత తెప్పిరిలి మాంద్యమువాయ, నెడంద యగ్నిప
ర్వతశిఖరంబునా బొగలువారుచు మంటలు గ్రక్క, సూర్యుడుఁ
వెత యిసుమంత లేక నను వింతగ జూచి హసింప, పెట్రోల్
స్రుతిశిఖపైన జారినటు రోషము తాపము మల్లడింపగన్.

ఇను డనియును ఘనుడనియును
దినమణి యని సర్వసాక్షి దేవుండని నా
మనమున దలపక యూనవ
ఘనతల నిలబెట్టి బలుకగడగితి నిటులన్.

గౌరవ మిచ్చి వృద్ధులఁగావలెగని యుంటెంత మీకు మా
వారు ఋణస్థులైన నోసపాటి క్రియంబును జూప కిట్టి స్వ
స్థారము లాడి యూయశము గాన్పోనజేయుటె? తిన్నయింటి కం
గారముగోల్పు నీచుడవు; గాముల రే డెటు లైతివో వింతయౌ.

నీకుశలంబు పెంపొందవ నిత్యము సంజ త్రివర్ణ పూరుషుల్
ప్రాకటభక్తి మ్రొక్కెదరు; భవ్యుడ వంచును విష్ణువంచు స
త్యాకృతి వంచు వేదఋషు లంచితరీతి నుతించు టెల్ల ని
న్నాకమలాప్త! దాని కివి యౌనె కృతజ్ఞతచూపు మార్గముల్!

బురదంబడ్డ చిరత్నరత్నమునకుం బోబోదు మూల్యంబు; ని
ష్ఠురణాన్వృత్తి సమస్తమానవమహాసంఘంబు దూషించినం
దరుగంబోదు తదీయగౌరవము; నీ ప్రాశస్త్యంబు లోకంబునన్
స్థిరమాకంబె మరేమి లాభములు సిద్ధించున్ మృషావాక్సిధీ?

నిన్నును నన్నును లోకము
లన్నియు సృజియించినట్టి యంబుజనాభుం
డిన్నరరూపము నొందిన
సన్నమె నీ కెఱుకపడని సంగతి దోచున్.

ధర్మ మడుగంటి దుర్నీతి దాష్ట్య మొకట
గలసి లోకంబు పాపపంకిలము గాగ
ధర్మసంస్థాపనార్థంబు దైవశక్తి
మానవాకృతి గైకొను మాట వినవె ?

తన రూపమునకు బ్రతికృతి
యన మనుజుని సృష్టిచేసె నాదిమ దేవ్రుం
డని యెంతు; బ్రాణికోటుల
మనుజుడు మేదోవిశేషమాన్యుడు గాడే ?

బుద్ధుడును క్రీస్తు మహామదు మొదలుగాగ
నెంద రాచార్యులో జన్మముంది రిలను
అట్టి మహానీయు లందరు నధమమైన
కోతిసంతతి యని చెప్ప గొంకు లేదె ?

మునుపటినుండి మానవసమూహము గాంచిన యున్నతస్థితుల్
పొనరిచినట్టి కార్యము లపూర్వమనోబలసిద్ధులుం, జిరం
తనమగు దేశనాగరికతల్ బహుశాస్త్రసమార్జనంబు జె
ప్పిన బదియేండ్లు పట్టు; బృథివిం గల దంతయు జెప్ప సాధ్యమే!

వీనికి మూలకారకులు విశ్రుతబుద్ధివివేకపూర్ణవి
ద్యానిలయుల్ సమర్థులు నుదారగుణాఢ్యులు పూజ్యులైన మా
మానవులేగదా, తెలివిమాలి వచించితి వింతసేపు నో
భానుడ, చాలుచాలు, నిక బల్కకు మేల వృథాప్రయాసముల్!

అన విని భాస్కరుండు మదియందు గలంగక నిండుకుండనా
దానకక మెత్తిపోటులకు దుందుడు కొందక కన్నబిడ్డ వా
గాను పలుకుల్ సహించు జనకుండటు మన్ననచేసి పల్కె నో
మనుజకుమార, సంక్షుభితమానస మారయ లేదు సత్యమున్.

అన, సూర్యుని శాంతంబున
కును నా మిడిమిట్టి పాటుకును లోసిగ్గుం
గాని వెరగుచెంది శాంతిలి
వినయము యత్నమున గాంచి వింటిని దుదకున్.

తాతకు దగ్గులు నేర్పెడు
రీతిగ భూలోకచరిత ప్రేలితివర రే !
మీ తాతాతంద్రుల క
జ్ఞాతము తా విషయముల బ్రసక్తియొనర్తున్.

ధరణి ముప్పదివేల వత్సరములపుడు
వదలె మనుజు డాటవికజీవనము మొదల ;
నాటినుండియు నేటికి నాగరికత
లెన్ని, రాజ్యంబు లెన్ని మోసెత్తి సమసె !

అదియు యొక గొప్పగా జెప్పనేల నీవు
బిందు వంతౌను విశ్వజీవితపయోధి ;
వృత్తమును నాదుపుట్టుపూర్వోత్తరముల
వయసు విన్న నీ వాశ్చర్యపడుదు వేమొ.

కూపస్థంబగు మండుకంబునకు దిక్కూలంకషాంభోధివే
లాపర్యంత జలావకాశమును డెల్పన్ దుర్లభం బౌను ; న
ట్లాపద్మప్రభవాండసంచరణని త్యానిత్యయాదృచ్ఛిక
వ్యాపారంబు లెఱుంగనీకు దరమే పల్కార బోధించినన్ !

అరయన్ నీకు స్వదేశ, మంత బరదేశానీక, మాపైని సా
గరవేలావలయీకృతోర్విని గనంగావచ్చు ; నాదృష్టి దు
స్తరవేధోండకటాహమంతటను సంసర్పించు ; నట్లాట ని
ద్దరకున్ దృష్టుల జీవితంబుల విభేదంబుల్ నిరంతంబులౌ.

నావయ సెంతో తెలియునె ?
నా విని, తల యడ్డమూప, నవ్వెను రవియున్ ;
మీవయసు దెల్పి యవ్వల
జీవితముంగూడ నాకు జెప్పుడ యనినన్.

చెప్ప దేలికయయ్యె నీచిత్రగాథ
విన్నవారలు నమ్ముట యున్న వింత ;
కాని, సర్వంబు జరిగిన కథయె దప్ప
అవగింజంత యత్యుక్తియైన లేదు.

ఎపుడు పుట్టితినోగాని యెఱుగజాల
మూడువందలకోటుల యేడులపుడు
ఉగ దెలిసె నన్ను జ్ఞాపక మున్న ; దింక
బ్రతుకవచ్చు ద్రిశతకోటివత్సరములు.

మున్ను నీ వంత పొగడిన భూతధాత్రి
పుట్టినాకన్నులెదుటనే పూర్వమందు ;
ఎవతెయో యను సందేహ మేల నీకు ?
కండలో గండ నా నయగారిపుత్రి.

సుడిగాలి యొక్క పెట్టున
వడినన్నొక యన్యలోకవాసుల నడుమం
బడ ద్రువ్వినట్టులయి నా
యొడలెల్లను గంపమొంది యూర్చుచునుంటిన్.

తెరగన్నులు తెరనోరును
విరవిర తడియారు నాల్క వెరగుమనంబై,
వెరపుగొని పూర్వధైర్యము
తెరుగన్ వినయంబులోన దండడిగొనగన్.

జలజాతాప్తుని భక్తినమ్రముగు వీక్షామాల సేవించి యం
జలిబద్ధుండనుగా వచించితిని: ఓస్వామీ, జగత్సాక్షీ, చం
చలచిత్తంబున బ్రేలుచుండిన ననున్ సంభ్రాంతు మన్నించి నా
కలుషంబున్ హరియింపుమంచు గరుణాంగాంక్షించి ప్రార్థించితిన్.

అజ్ఞానతిమిరనష్ట
ప్రజ్ఞుడనై యల దివాంధభావంబున మీ
విజ్ఞానరోచిరుదయ ము
వజ్ఞత నరికట్టి హాస్యపాత్రుడ నైతిన్.

అని నే నీవిధి విన్నవింప గరుణాహాసంబు నెమ్మోమునం
దానకన్, నీ వెప్పుడైన నామతము పొందుం బాడియుంగందు వం
చనుకొందుం, దడవేల, నాచరిత నెయ్యంబార వర్ణించెదన్
వినవోయీ, యని చెప్పసాగె హృదయావిఖ్యాతచిత్రంబుగన్

జనకజనయిత్రి భావముల్ సమత గలసి
యర్ధనారీశ్వరం బైన యాదిశక్తి
ప్రకృతి పురుషసమ్మేళన భవ్యమూర్తి
విశ్వజనని వర్ధిల్లు దుర్వీక్ష్యకాంతి.

ఆమహామాత యగ్నిగోళాండములను
పెట్టె, నందొక్కటొకటియు బ్రిదిలి భాను
బింబములు పుట్టి యాకాశవీధి కెగసె :
అనుజు లందరలో నేన యల్పతనుడ.

అన్నుల నొక్కడొక్కడు మహోద్భుతశక్తి సమున్నతాత్ముడై
యిన్నన సర్వసంపదల మీఱుచు రాజ్యము లేల, నీవు ఈ
తెన్నున బొల్లుగింజవయి దేనికి నక్కఱయుండ గాంచి నా
కన్నులు కాయగాచి గొడుకాయని తల్లి సడించు మాటికిన్.

అది యటులుండ, నాయొడలియందు వికారపు నల్లమచ్చలుం
బొదలిన జూచి "యమ్మకడుపుం జెడపుట్టినవాడవంచు" న
న్నదవదపెట్టి కాలొడిసి యంతనె గిర్రని త్రిప్పిత్రిప్పియుం
జదలున బైకిబో విసరె జండసమీరము రేగి చుట్టగన్.

అదురా్వరమహోగ్రదిక్ప్రళయవాతాలోల కాదంబినీ
ప్రాదుర్భూత తమఃపరంపర దిశాభాగంబులంగప్పె; ను
ల్లాదండంబులు బాణవేగమున రాలంజొచ్చె; నక్షత్ర ధూ
ళీ దిగ్భ్రాంతి చెలంగె; నింగి రొదగొల్పెం గ్రిందుమీదైనటుల్.

మననాతీత మనోజవంబున నభోమార్గంబునం బోవుచో
మును నం దాకిన తారకల్ పగిలి దుమ్ముం ధూళిగా రేగి నా
వెనువెంటం బర తెంచ, జూడవడియున్ విస్వాధి స్వర్గంగ మ
త్తనుసంతాపము వాప శీతజలపాతంబై సమీపించెనన్.

అప్పటి నామనోనుభవ మద్భుత మేమని చెప్పవచ్చు! నే
నుప్పర మేగునప్పుడు నుదూత్కార మొయ్యన గ్రిందజారున
ట్లొప్పెను; బోవబోవ బయి నోరల గ్రింద నమేయగోళముల్
గప్పిన యంతరాళము వికస్వరమై కనువిందొనర్చెడుఁ.

వారణము వారిమగ్న కుంభస్థలంబు
నెత్త, వలయంబు క్రమవృద్ధి నొత్తినటుల
బైకి జనుచుండ, మిన్నులు వడ్డచోటి
పరిధి, వామనరూపంబుపగిది నెదిగె.

పుష్పలావర్తకంబులు పొదలినట్లు
తారకాధూళి మొత్తమై తనర, నందు
సుడితుపానులు లోలోన సుడిసి రేగి
ప్రథిత నటరాజ తాండవ భ్రాంతి గొలుపు.

తేలెడు తెట్టెలా పగడదీవు లనఁ మెలమెల్ల దారకా
జాలము లేడకో చనెను జాడ గనంబడు; దోకచుక్కలు
ద్వేలరయంబునఁ గగనవీథి గ్రమించి నటన్మయూరపిం
ఛాలము పుచ్ఛవిభ్రమము లన్నిదెసల్ ప్రసరింపజేసెడిఁ.

తెలుపు పసుపును నెఱుపు లేమొలక నీలి
రంగులం బొల్చు తారలు నింగి వ్రేల,
మాపు, బహువర్ణ విద్యుత్ప్రదీపికలను
అందగిలు పెండ్లిపందిరి యనగ దోచు.

ప్రళయవాత నిరంతరావర్తమందు
దోకచుక్క దగుల్కొని తొలగలేక
తిరిగె నన దారకారాశి దిరుగుచుండె
నుల్కలం గురిపించుచు నుప్పరమున.

పంక నిర్మగ్నమయి లేవ వలనుపడక
ధూమ్ర బృహదశ్వ మొక్కటి దోచె మింట;
దాని దప్పింప క్షణమైన దడవులేక
యతుల జవమున పైపైకి నరుగుచుంటి.

నిలువక కొంతకాల మటు నే బయి కేగుచు నుంటిగాని యు
జ్జ్వలదుడుఖండమండలనిబంధమునం బడి చిక్కుకొంటి; ఆ
స్థలము పరిక్రమింప బలదర్పము చాలమి గొంతకాల మా
కులపడి దారిచేయుటకు గుమ్మరిసారెగతిన్ భ్రమించితిన్.

పరిసరధూళి మేఘములు పాయలుగా బరికీర్ణమౌచు లో
బిలవిషీ మత్తనుభ్రమణ వృత్తమునం బడి భీషణాగ్నికిం
గరగి మదీయదేహమును గ్రచ్చుకొనంగ, దదాది రాశి దు
ర్భరమయి యున్నలట్లు బలవంతుడనై యభివృద్ధి నొందితిఁ.

ఇట్టు లుండగ నాకన్న నెన్ని రెట్లొ
ఘనతరం బగు తార నాకడకు రాగ
మించు భయమున మేను కుంచించి యొదిగి
గతుకులో బడ్డ బండినా గదలిపోతి.

బొదబొదగా లొదలొదగా
కదలెదు నా దేహమందు గణితలు పుట్టెఁ ;
ముదిరి యవి పెద్దవాయెను ;
కుదుటను మెయి తూకువాసి గునుకుచు నుంటిఁ.

భ్రమణ విస్తారవేగ దుర్భాగహతికి
గణిత లెల్ల వృంతచ్యుతి గాంచి చెదరి
బహుళదూరంబునం బడి భ్రమయుచుండె ;
అక్షమును జక్రమటు నన్ను నాశ్రయించి.

అందునొక్కటి మీపృథ్వి యా గుమార ;
కాని, దానికి నొక పెద్ద కణిత పుట్టె ;
అదియు గాలక్రమంబున ముదిరి, ఏడి,
సోమబింబంబునా భువిచుట్టు దిరుగు.

ఇవి యెల్లఁ వచియింప గొన్ని నిమిషాలే యైన, నెన్నెన్నొకో
ట్లవు వర్షంబులు చెల్లె దద్విషయముల్ సాతంబుగా సృష్టికాఁ;
కవి, నీభావవిహారఖేలనము విఖ్యాతంబుగా సాగ గ్రొ
త్తవివిశ్వాద్భుత దృశ్యమార్గములు మోదస్ఫూర్తిసూచించితిఁ.

మాటాడ దలచియును నా
నోటను దడి లేక యడ్డునుడివిన నేమో
లోటగు ననుకొని వెరగుం
పాటున రవిజీవితంబు బాయక వింటిఁ.

విని యిటు లంటి: నో ప్రభువ, విస్మయచిత్తుడ నైతి మీచరి
త్రను విని; విశ్వదర్శనము తన్మయతం గలిగించి నామనం
బున నవవిజ్ఞతాంకురము మోసిడ జేసెను; మూఢభక్తివ
ర్తిని త్రుటిమాత్ర సత్యపరిధిఁ నిలబెట్టితి వయ్య భాస్కరా.

వినను సంశయములు నా
మానసమున నంకురించె ; మనవి యొనర్తున్ ;
భానుం డొకడే యని యా
మానితుడున్ మీరె యని భ్రమం గొనియుంటిన్.

మీమాటలు విన్నంతట
వ్యామోహము కొంత దొలగె, నైననుగానీ
వ్యోమము గాలించిన ది
క్సీమల బరసూర్యు డెవడు చిక్కడు దృష్టిన్.

నీదు సందేహమున గొంత నిజము గలదు ;
ఈ ప్రపంచమునకు నేన యినుడ నౌదు ;
తక్కు భాస్కరు లూహింప దరముగాని
దూరమున నుంట జుక్కలై తోచుచుండ్రు.

వారిచుట్టును గ్రహములు భ్రమయుచున్నె ?
వారలకు నిట్టి ధరణులు ప్రజలు గలరె ?
అంద రర్కుల గుత్తిలో నణచుకొన్న
విశ్వకర్తర మది యెంతవిస్తృతంబొ !

చాల సూర్యు లేకాకులై సంచరింత్రు ;
కొందరను జుట్టి గ్రహము లందందు దిరుగు ;
ఉష్ణ మనుకూలసిద్ధమై యొప్పుకతన
ప్రస్తుతము ధాత్రి గొనసాగు ప్రాణిసృష్టి.

వసుధ నంతట నెందరు ప్రజలు గలరొ
అన్ని తారక లొప్పారు నాకసమున ;
ప్రాత తారలు చల్లారి భస్మమైన
క్రొత్త తారలు పుట్టు నేకోణమందొ.

విశ్వవైశాల్య మింతని విశదపరుప
వలనుపడబోదు నావంటివానికైన ;
నిఖిల సౌరకుటుంబముల్ నియతి లేక
చెదర జల్లిన విధమున గుదిరియుండు.

అరయ. నిరువదిలక్షల యంతరీప
విశ్వములు గ్రాలు బ్రహ్మాండ విపులకుక్షి ;
నందు నొక దీవి నారాజ్యమౌ కుమార,
యితర దీవుల కిట్టులే యినులు గలరు.

*మనకు దగ్గరగా నున్న యినుని రశ్మి
ధరణి జేరంగ నైదేండ్లు జరుగవలయు ;
దూరతములైన సూర్యుల దొరగు కాంతి
ప్రాకు బకునాల్గుకోట్ల వర్షముల నిలకు.

ఎనిమిది నిమిషంబులలో
ననయము మత్కాంతి భూమి కరుగుచునుండుఁ;
గనుగొనుమ పోల్చి యెంతటి
ఘనవిస్తృతి గలదో విశ్వకర్పరమునకుఁ.

ధరణికన్న నే దశలక్షల తరము లెచ్చు ;
మరియు నాకంటె దశలక్షతరము లెచ్చు
గలుగు నెన్నెన్నొ తారలు గలవు చదల ;
అన గొనయు లేని యీసృష్టి కంతు లేదు.

ఇది యెట్లు సంభవించును ?
మొదలుం దుది లేని దొకటి యొనయునె ? శంకా
స్పదమగు మీమాటలు ; న
య్యది యెటు లూహింపవచ్చు నన, రవి యనియెఁ.

* కాంతి ఒక సెకండునకు ౧౮౬౦౦౦ మైళ్లదూరము ప్రసరించును.

దారల్ పుట్టును, చచ్చి భస్మమగు ; దద్భస్మంబె వేరొక్క రూ
కారంబుం గొని నూత్నజీవనముతో గంపించు ; గల్లోలినీ
పూరం బింకియు బాష్పమై జలదమై పూరించు వర్షంబు ; నీ
దారిన్ విశ్వ మనంతరజ్జువటు నిత్యంబై భ్రమించుంగదా.

స్థితియు రూపంబు మారును జేటు లేదు
అసలు వస్తువునకు నెప్పు డరయుమోయి ;
మంటిగోడ వాన గరంగి మన్నుగాగ
అదియె పరగృహనిర్మాణ మందు నొదవు.

సృష్టి లేని క్షణంబు నూహింపలేము ;
విలయ ముండని త్రుటిని భావింపలేము ;
ప్రతినిమేషము భిన్నాంబుపూర మగుచు
బారు జీవనది యగు విశ్వంబు సఖుడ.

భానుకుటుంబములకు నా
భానుల కటు తప్పకుండ బ్రళయము గల్గున్ ;
గాని, యిటు విశ్వమంతకు
నేనాడును లేదు విలయ ; మిది సత్యంబౌ.

అన విని గర్వలేశము హృదంతరమందు జరింప, లోన నే
ననుకొనుచుంటి : సూర్యుని నియంతృత రాజ్యము విశ్వవీథిలో
అణురజమంత యౌ ననుచు; నంత వసుంధర జ్ఞప్తిరాగ సి
గ్గున దల వంచి నాతలపు గూఢముగా సవరించి పల్కితిన్.

ఇంతటి సత్క్రియులను
ఇంతటి నిర్గర్వమతుల నెందును గన, మీ
స్వాంతంబున గాంతాళము
చింతాకంతయును లేక చెప్పితి రిటులన్.

నాకన్నన్ మహనీయులైన రవు లున్నా రన్న మీమాటకున్,
నాకుం జోద్యము గల్గె; నన్యరవి యౌన్నత్యంబు నిష్కైతవ
ప్రాకామ్యంబున వర్ణనల్ సలుపు స్వార్థత్యాగసంపత్తి మీ
ధీకారుణ్యము గౌరవంబు దెలుపుం దెల్లంబుగన్ భాస్కరా.

పలుమరు నీరజాతహితు బ్రస్తుతియించి, యనంతరంబు మీ
వలన ననంతవిశ్వపరిపాలనగుప్తసమస్త ధర్మముల్
వెలితి దొలంగ వింటి బహువిజ్ఞత చేకుర; నైనగాని మా
యిల మిము వీడి యవ్వల నెట్టుల నుండెనో చెప్ప వేడెదన్.

తమకు ముద్దుల కూతురు ధరణిదేవి
చిన్నదయ్యును వయసులో జిన్నదయ్యు
ప్రాణికోటుల భరియించు భవ్యవృత్తి
మహితయాచు వెలుంగు మా మాతృభూమి.

అని నే విన్నప మాచరింప విని నెయ్యంబార సూర్యుండు నీ
ఘనవిజ్ఞాన తృషాపనోదముగ వక్కాణింతు భూదేవి గాం
చిన మార్పుల్ పరిణామసంచరణ నిశ్శేషవిశేషంబులన్
వినవోయీ కవితాతపస్వి, యని గావించెం గథారంభమున్.

ధరణి యున్నూరుకోట్ల వత్సరములప్డు
ఖండరించెను నామేనినుండి వీడి;
నెత్తురుం గండ లోకపుటట నెలవుకొనిరాలు
దంష్ట్రి యాస్యోష్ణత త్ర్యంబు తనయయందు.

విధివశంబున దనువులు వేరుపడియు
ప్రేమసూత్రాలు తెగవు మా హృదయములను;
మచ్ఛరీరభరాకృష్యమాణ యగుచు
అవని నాచుట్టు దిరుగు జక్రానువృత్తి.

ఈవిధి బెక్కువత్సరము లేగిన బైకొను నగ్నికీలలుం
దీవరమైన క్రొంబొగలు దిక్కుల దాపము రేపు వేండ్రముం
జావ, గ్రమక్రమంబుగ బ్రశాంతత నొంది, తటాక మొండ బై
పై వడబారి కర్దమము పక్కులుగట్టెడుపోల్కి జూపడెఁ.

లోలోనం బరితప్తమై ద్రవము కల్లోలించి యుత్క్షిప్తమై
రాలం, గన్నుల పండువై తనరె ధారాయంత్రనాళోద్గిర
త్తాలోత్తాల జలప్రకాండ మన; దద్ధారారసంబుల్ పయిఁ
జాలుల్వారి వటించి గట్టిపడి రాచట్టుల్గ మున్నేర్పడెన్.

దినదినము గల్గు భూకంపతీవ్రతలకు
బైని బెరడులు పెటిలి లోపలకు గ్రుంగి
కాకకు గరంగి క్రమ్మర గల్లుగట్టె;
అట్టి కల్లులె గిరులకు నడుగుబందు.

తొలుసృష్టి బండ లెట్లగు?
జలమని కొందరు వచింత్రు; సత్యం బేదో
పలుకుమ యని నే వేడిన
జలజాతాప్తుండు సంతసంబున నుడివెఁ.

అతిగ దీంద్రించు వేడిమి నవని కాగ
నీర మచ్చోట నెట్టుల నిలువ నేర్చు?
బాష్పరూపంబుగా నభోభాగమందు
నంతరము లేక యెల్లెడ నాక్రమించు.

జరిగె బెక్కేడు; లుష్ణాతిశయము కొంత
తొలగె; నావిరి తడివారి తొలకరింప
అంతరాగ్నికి దప్తమా నవని బడిన
యంబుబిందులు చుయ్యని యావిరయ్యె.

గుంట మిట్టలు గండులు గుట్టలునుగ
ధరణి యెల్లను విషమమై పరగుచుండె;
అగ్నిపర్వత శిఖరంబు లచ్చటచట
గడుపులో మంటలను వెళ్లగ్రక్కుచుండె.

కరగిన శిలాద్రవంబు ఉప్పరము జిమ్మ
లోన గొన్ని తలంబులు లొత్తలగుచు
పైన గట్టిన రాచట్టు పగిలి క్రుంగి
వెడలుపైన పల్లంబులు గడలుకొనియె.

నిన్న జూచిన తలములు నేడు చూడ
కనుగొనగరానియటు మార్పుగాంచియుండు ;
క్షణముక్షణమునను భిన్నవికారములను
జెందుచుండెను ధాత్రి విచిత్రగతుల.

మొయిలులుగట్టెను ; వానలు మొదలువెట్టె
ధరణిపయి దాటినూనెత్తుదాక నెరసి
ఆవిరింబోగ గాలి కుయ్యాలలూగి
మత్తరాంశుప్రసారంబు మరుగువెట్టె.

అంతట నాదిమప్రకృతి యాకులభావైకఖేలనంబు ను
ద్రాంతముగా జెలంగె ; జలదపటలముం బన వానపట్టె ; ది
గ్దంతుల కుంభముల్ పగులదన్నుచునట్టుల వజ్రపాతముల్
ఇంతకు సంతకుం బ్రబలె; హెచ్చె సమీరనిహారదర్పముల్.

వాననీటను బల్లాలు పర్రలెల్ల
నిండి వారిధులయ్యె ; ఆనీటియందు
అవని గల యుప్పుధాతులోహములు గలసి
యొక యపూర్వరసాయనయోగ మొదవె.

శ్యామలోహిత కిరణసంస్పర్శనముల
జలధియోరల చోరపుష్పంబు పూచె ;
మంచునీటను అప్పాళె నానాగి కరగి
చిగురునునుగల తొలి యొంటు సృష్టియయ్యె.

అందుల నణుప్రమాణములైన సూక్ష్మ
జీవు లెన్నెన్ని ప్రభవించి చెదరిపోయె ;
అలలపై దేలి యంచుల కరిగె గొన్ని
అడుగుభాగంబు మరికొన్ని యాశ్రయించె.

అన విని నే ప్రశ్నించితి
వనజాక్ష, [illegible] ద్యపుడనో! జీవం
బెనయునది సూక్ష్మాంశమ్ములను
జనియించునె యెంతొ [illegible] యనశక్తిన్.

చేతనాచేతనవిచారసిద్ధి గన్న
సత్యవిదులకు దీన సంశయము లేదు ;
కాని, మనుజుల కింక నాజ్ఞానశక్తి
కలుగ ; దొక వేళ నికముండు గలుగవచ్చు.

అట్టులైనను దేవుని కాటవిడుపు
నిచ్చి పంపించవచ్చు నోయినుడ! సృష్టి
యాదిశక్తికృతం బని యంటి వపుడు ;
ఇటు రసాయనశక్తి గుణం బేల వచ్చె ?

ఆదిశక్తి యన్నను దైవ మన్న నొకటె ;
మాటభేదమె యసలులో మార్పు లేదు ;
ప్రకృతిపురుషులు క్షీరనీరంబులటుల
కలసి, యవిభాజ్యులై యైక్య మొలసియుంద్రు.

ప్రకృతిపురుషు లన్నను రెండు వ్యక్తులటుల
వేరు గాదోయి యొకదాని భిన్నదిశలె ;
ఆదిశక్తి యటంటి ము న్నట్టిదాని ;
అయిన, నిపు డేమి తలక్రిందు లరసి తీవు ?

* కాలావకాశములు ము
న్నొలిక భిన్నంబులయ్యు నుత్తమశాస్త్ర
జ్వాలాత్తమయి కరగి
మేళకమయి యొక్కటాచు మెలగవె నేడు ?

* కాలావకాశములు - Time and Space.

దైవమన సృష్టిబాహ్యమై తనర దెవుడు ;
అణువునందును బ్రహ్మాండమందు నేక
సరణి నాశక్తి వ్యాపించి సర్వసృష్టి
హేతువయి నిత్యవిశ్వసంసృతిని నడపు.

అటు రసాయనక్రియలకు నడుగుబందు
అణువె యాటను లేదె యం దాదిశక్తి ?
కార్యకారణబంధంబు గడవరాని
సృష్టిసూత్రంబు ; నిత్యమై చెలగునోయి.

తన రూపమునకు బ్రతికృతి
యన మనుజుని సృష్టిచేసె నాదిమదేవుం
డని పలికి తీవు ; మనుజుడు
తన రూపమె యంటగట్టె దైవంబునకున్.

పిల్లి యూహించు దేవుని బిల్లియటుల
నక్కకున్ దేవు డుండిన నక్కరూపె ;
అన్ని రూపంబు లెత్తెడి యాదిశక్తి
కొక్క రూపమె ప్రియమయియుండ నేల ?

అని యిటు సూర్యు డాడిన దదర్థము చక్కగ బోధగాక నా
మనము కలంగి రేగి విసుమానము సంశయ ముప్పతిల్లె; నే
వుని విషయంబు లెందు ముదిపోవవు, రావను కాష్ఠమట్లు ని
త్యనవములై చిరంతనములై కననౌ నెవ రెన్ని చెప్పినన్.

పాద గదలు తీవ లాగిన,
మొదలిడ నీచర్చ యింక ముగియక సాగుం;
గదలెడు దరణియు, నూరక
వదరక శేషంబు వినుట భావ్య మటంచున్.

ప్రథమమున సూక్ష్మజీవులు ప్రబలె నంచు
నంటి రామీద నేమయ్యె నానతింపు ;
చిత్రచిత్రంబుగా నొప్పు సృష్టిచరిత
వినవలతు నన్న సూర్యుండు వినిచె నంత.

జననంబు మాతృకార్యము
తనుభంగము సంతువృద్ధి తత్ క్షణమందే
కొనసాగు సూక్ష్మజీవుల
కనయము; నిటు లక్కలేదు లరిగినపిదపన్.

పరిసరంబుల భేదంబుబట్టి వాని
యందు ప్రత్యేకతలు కొన్ని వ్యక్తమయ్యె;
అంచు నున్నవి పచ్చని యణువు లయ్యె;
క్రింద నున్నవి వేరె యాకృతులు వడసె.

అంచుల బచ్చని యణువుల
సంచయములు చేరి బాహ్య జాలకముగను వ్యా
పించి చిరుపాచి పట్టిన
సంచున బయినీట విరివి సాగుచునుండెన్.

మిగత యణువులు కంటికి దగులునట్టుల
గ్రములుగా సారించి రీణాము మొనయుచుండె;
జీవనస్పర్ధ సామాన్యచేష్ట యాట
బలము గలయవి దుర్బలములను మెసవు.

కడలినీర మింకను ధాతుకలిత మయ్యె;
శీతవాతోష్ణపరిసరస్థితులు మారె?
అనువుపడని బహుప్రాణు లంతరించె;
అన్యజీవులు మార్పుల ననుసరించె.

నాచుతీవల గొమ్మలు ననలువెట్టి
వనధితరుజాతులై మున్ను పరిణమించె;
అడుగుబురదను సున్నంబు గడలుకొనుట
పగడతీగలు గుల్లజీవములు పుట్టె.

ఉదధియప్పుడు గాధమై యుండుకతన
వర్షఋతువుల బెల్లుబ్బి పైకి బార
బ్రక్కపడియలు గుంటలు పర్రలందు
బ్రాణికోటులు నాచుతీవలును జేరె.

అంత గాలానుసరణి నిరస్థికములు
పలుతెరగులైన జలచరములు జనించె;
జల్లిచేపలు పీతలు సలిలవృశ్చి
కములు నత్తలు జలగలు గండరించె.

పడియలలోనదప్పు బెరపట్టుల వృక్షము లేవి లేవు; మీ
పుడమియు బచ్చవారక యపూర్వమరుస్థలమట్లు చూపడెం;
బాడవుగ దాటిపోదెలటు పుట్టియు మ్రాకులు, పూలు పండ్లు చొ
ప్పడవు; తరుప్రకాండముల బ్రాచిమె యాకులుగా జిగిర్చెడున్.

జల మింకిన పడియలలో
నిలిచిన భూజములు కొన్ని నెలలు వడివడఁ
అలవాటుపరచుకొని య
వ్వల నిర్జలభూమి మొలచి వర్ధిలుచుండెఁ.

జలనిధి బుట్టె వెన్నెముకచట్టము గల్గిన చేప, లవ్వియే
యిల గల సర్వజంతువుల సృష్టికి మూలమటన్న, వింతగా
దలచి యిటంటి: నోతరణి, తథ్యమె? పూర్వఘు మానవావళుల్
కలిగిరి కోతిసంతతులుగా నని చెప్పిరి రిందు కేమనన్.

వినుమోయీ, సర్వంబును
వినుటకు మున్నేల యింత వేగిరపడగఁ ;
గనుగొందు వీవె చేపలు
వననిధి విడి బయలుప్రాకివచ్చినవిధముఁ.

పడియల నీర మింకి వడబారిన పంకము నందు గూరికొం
చదుగున నుండి గాలికయి యాదల లెత్తుచు బీల్చుచుంట నే
ర్పడె దమ దేహమందు నిరుప్రక్కల నూపిరితిత్తు; లాపయిం
బొడమెను వాని సంతతుల బూర్వముకంటెను గొన్ని భేదముల్.

గాలిపీల్చుట పొడినేల గదలుచుంట
ఎండవేడికి దాళుట యెగిరిపడుట
నలవరుచుకొన్న నూత్నమత్స్యముల సంతు
బయట నీటను నడయాడ వలతు లయ్యె.

అక్కరను బట్టి రెక్కలయందు మార్పు
కలిగి లక్షల యేండ్లకు గాళ్ళునాట
జలచరత్వము నానాట సమసిపోవ
భూచరత్వము సమకూడి పొదలె నవియు.

ఇలపయి వింతవింతల మహీజము లుద్భవమయ్యె; బోదెలం
కలిగె బెరళ్ళు; నాకు లాడికమ్ముగ గొమ్మల నిర్మించె; భూ
స్థలిని అరణ్యముల్ బలిసె; దామరతంపరగాక దోమ లీ
గలు పురుగుల్ చిటారుములు కీటకచీమలు పుట్టి వెల్వడెన్.

బయట నీట జరించెడు పాము తేలు
కప్ప తాబేటిజాతులు కానిపించె;
నవియు గొన్నేండ్లకు నరణ్య మాశ్రయించె;
జలధిజీవులు మెట్టవాసంబు గాంచె.

తోకతోకలగించి తునుపంగమెలివెట్టి
యన్యోన్యబలశక్తులరయలాగు;
లాగి పట్టునడల్చి వేగంబ పయిని క్కి
యొండొండు గొంతుక లొడిసికొరకు;
కొరికి లోదనియక కుయివెట్టి గర్జించి
పొట్టలో దలబెట్టి నెట్టిపొడుచు;
పొడిచి క్రిందకునొక్కి పొర్లింప నదిలేచి
తోక గిర్రని త్రిప్పి తుక్కు రేపు;

రాతితిప్పల దారగు నిర్ఝరములట్లు
కాయమున నెత్తు రూటలు గారుచుండ
అలసి సొలసి యం దొక్కటి యంతరించు;
ఇంకొకటి తెప్పిరిలి వన మేలుచుండు.

గాలికి నెండకుం దరుచుగా జడివెట్టిన నీటి ధాటికిన్
రాల గరంగు ధూళి కుధరంబుల చేరిన బంకమన్ను జం
బాలము గాగ నెల్లెడల బారి కుజవ్రజ మున్న పల్లవుల్
నేలలు నిండ నందు రమణీయసుమంబులు పూచె వల్లులన్.

ఎగురగల పాము లుడుతలు వృద్ధిచెందె;
పలువిధములైన గబ్బిళములు జనించె;
అవల నీకలు రెక్కలు నంకురించి
గగనచరపక్షిజాలము గానిపించె.

నిసువులకు జన్నుగుడిపెడు
పసరంబులు కరితురంగవర్గంబులు ముం
గిసలుఁ జింకలు సింగము
లెసగెను, వచియింప నలవియే యవి యెల్లన్?

విపినచరమర్కటంబులు వేనవేలు
తెగలుగా నయ్యె బరిసరస్థితుల బట్టి;
ఆకృతుల లావుపొడుగుల నాచరణల
నలవడియె భేదగతులు కాలానుసరణి.

వానిలో వాలహీనములైన నాల్గు
జాతులు క్రమక్రమంబుగ జననమొందె;
అందు నొక జాతి వానర మవయవముల
బోలికల మానవునకు దాపునకు వచ్చు.

